Regd. No. M. 3813

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురువారములందు వెలువడు అర్ధవార జాతీయ పత్రిక

సంపుటము ౧౮ ● హైద్రాబాదు దక్కన్ శా. శ. ౧౮౬౫ స్వభాను శ్రావణ బ॥ ౧౨ ౧౯-౮-౧౯౪౩ గురువారము ● సంచిక ౩౦



## ఇండియాలో విదేశీయ యుద్ధఖైదీలకై ఖర్చు

క్రొత్తఢిల్లీ, ఆగష్టు ౧౭

ఇక్కడ స్టేట్ కౌన్సిలు సమావేశములో ఒకరి ప్రశ్నకు ప్రధానసేనాని సమాధానమిచ్చుచు విదేశాలనుండి తెచ్చియుంచినశత్రు యుద్ధఖైదీలకై ఇండియాలోపోయిన మూడేండ్లలో ౧౮ కోట్ల ౧౦లక్ష రూపాయీలు వ్యయమైనదనియు దీనినంతయు బ్రిటిషుప్రభుత్వమే భరించెననియు చెప్పిరి.

## చౌకపాలకై ౪౦౦ మంది పిల్లల మొఱ

బొంబాయి పురపాలక సంఘ సమావేశమువద్ద ప్రదర్శనము

బొంబాయిపురపాలక సంఘము ఆగస్టు ౧౭తేది సాయంకాలము సమావేశమగుటకు ముందుకాలి నాలి చేసికొనువారల పిల్లలు సుమారు ౪౦౦మంది ఆపురపాలక సంఘ కార్యాలయ ద్వారమువద్ద కూర్చుండి "మాకు చౌకగా పాలిప్పించండి" "మాకు మంచిపాలు ఇప్పించండి" అను కేకలను శాంతముగా వేసిరి.

## ౭౦౦ గ్రామములు వెల్లువలలో కొట్టుకొని పోవుట

కల్కత్తా, ఆగస్టు ౧౮

ఆగస్టు ౭వ తేదీన కల్కత్తా దివిజనులో పెద్ద వెల్లువవచ్చి ౩౦౦ గ్రామములు పూర్తిగా నీటిలో మునిగిపోయినవి అనేకులుస్త్రీలు పురుషులు చెట్లెక్కి ప్రాణములను రక్షించుకొనిరి. ఒకడు ఒక గ్రామపు తీగను పట్టుకొని ప్రేలాడుచుండెను. తగినన్ని పడవలు లేనందువల్ల వెల్లువనుండి జనులను రక్షించుట కష్టమయ్యెను.

పోయినవారమునుండి రాజపుత్రస్థానములో బెనాసనదిలో వెల్లువలువచ్చిమాలర్నా సావాయ్ మాధవపూరుల మధ్యప్రదేశము ప్రవాహముచే నష్టపడినది. ౩౦౦ గ్రామములు అనేకములైన పశువులు కొట్టుకొనిపోయినవి. 'మార్వారిరిలీఫ్ సొసైటీ' అనుసంస్థ జయపూరు సంస్థానపు ప్రజామండలి వర్కర్లుతో కలిసి బాధితులబాధలను తొలగించుటకై యత్నించుచున్నది.

## అష్టావధానము

శ్రీస్వభాను నామసం॥ శ్రావణపూర్ణిమా (౧౬) భానువారము సీతారాంబాగులో శ్రీను సుభాయ వేదాంతవర్ధనీ సంస్కృత పాఠశాల యువజన విద్యార్థిసంఘపక్షమున సభా సమావేశము జరుపబడి శ్రీమాన్ వేదాంతశిరోమణి అమర.. దివేంకటవరద హాచార్యులవారి అధ్యక్షతలో ప్రథమమున (శ్రావణపౌర్ణమియందు ఉపాకర్మ చేయవలయు) ననువిషయము కొందరిచే చర్చింపబడి, అటుపై శ్రీమాన్ అవధానసుకవి (చిలుకమర్రి) రామానుజాచార్యులుగారిచేత సుప్రసిద్ధముగా అష్టావధానము చేయబడి పైవిద్యార్థిసంఘపక్షమున హనుమాన నాశీస్సులతోపాటు సభ్యులకు సమర్పింపబడుటతో సభ ముగియనైనది.

* *

## ప్రతిజాతికి స్వపరిపాలనపు హక్కు

రూజ్వెల్టుగారు అట్లాంటిక్ చార్టరుకు బద్ధులగుట

వాషింగ్టన్, ఆగస్టు ౧౮

అట్లాంటికుచార్టరుయొక్క రెండవ వార్షికోత్సవమును స్మరించుచు రూజ్వెల్టుగారు ఈక్రింది ప్రకటనచేసినారు.

"అట్లాంటికుచార్టరుపై సంతకములనుచేసి నేటికి రెండవసంవత్సరము ఆరంభమైనది. ఈసమయమున నేను ప్రపంచమునకు ముమ్మొందు మంచిస్థితివచ్చుటకు వేటిని మేము నమ్ముకొనియున్నామో అట్లాంటికుచార్టర్లోని అప్రయోజనములలోను సిద్ధాంతములలోను రెంటిని నేను ప్రత్యేకముగ రెంటిని పేరుపేర్కొందును. మొదటిది—ప్రతిజాతి ప్రజలకు తామెట్టిపరిపాలన పద్ధతియందు ఉండవలయునన్నారో ఆస్వపరిపాలనపద్ధతిని నిర్ణయించుకొనుటకు కగలహక్కుగలదని ఒప్పుకొనుట.

అట్లాంటికు చార్టరునందు సంతకములు పెట్టినపుడు ఇది సాధ్యపడదని చెప్పినవారలుండిరి. అయిననునేడు విమోచనసేనలు ముందుకుసాగుచుండ, తమశాసనములను తామునిర్ణయించుకొనుటకు ప్రజలకుగలహక్కు మరొకసారి ఉజ్జీవితమగుచున్నది.

రెండవది— అందరికిని క్షేమముగా ఉండుటకొఱకును కార్మికులస్థితి బాగుపడుటకును ఆర్థికస్థితిబాగుపడ కలుగుటకును, ప్రపంచమందు అందరునుఐకమత్యముతో పనిచేయుట.

మనమిప్పుడు పెద్దయుద్ధము చేయుచున్నాము. మనము సంయుక్తజాతులపక్షమున పోరాడుచున్నాము. ఆజాతులలో ప్రతివారును అట్లాంటిక చార్టరులోని ప్రయోజనములను సిద్ధాంతములను ఒప్పుకొనియున్నారు.

నేనుమనము ఈయుద్ధములో క్రొత్తమార్పును చూడనున్నాము. మనశత్రువులపై మనకుసంపూర్ణవిజయము కలుగవలెనని మననిశ్చయమైయున్నది. మనశత్రువులు జర్మనీ, ఇటలీ, జపానుమాత్రమే కావనిమనము ఒప్పుకొనియున్నాము. పరపీడనము ఓర్పులేనితనము, క్షేమములేకుండుట, అన్యాయములను నీనాగరికతాభివృద్ధిశంగకారులన్నియు మనశత్రువులే.

## కాశ్మీర సంస్థాన ప్రజల అవసరాలు

విచారణసమితిఏర్పాటు

శ్రీనగరు, ఆగస్టు౧౧

కాశ్మీరసంస్థాన మహారాజాగారు నియోగించిన విచారణసమితియొక్క ప్రారంభ సమావేశము న్యాయమూర్తి గంగానాథ్ గారి అధ్యక్షతన ఆగస్టు ౯తేదీన జరిగినది.

ఆసమితికిపంపించిన ఒకసందేశములో ఘ. వ. కాశ్మీరప్రభువుగారు ఇట్లుతెలిపినారు. "నాప్రజల క్షేమమునకు సంబంధించిన విషయములను గురించి సంపూర్ణమైనవిచారణచేసి, వేర్వేరు తెగల ప్రజలయొక్క అన్నివిధముల అభివృద్ధికొఱకు ఆచరణీయములైనసూచనలను సరిగాఆలోచించి చేయవలసినభారమును మీకుఅప్పగించుటకు మేముసిద్ధమైయుంచినాము" అనివిచారణసమితిసమావేశమందు అధ్యక్షులవారు ఇట్లుచెప్పిరి. "కాశ్మీరసంస్థాన ప్రజలు ఈసమితి వారికి తాముచెప్పదలచినదానిని చెప్పవచ్చును, కష్టసుఖములను మనవిచేసుకొనవచ్చును, తమకష్టములను నిర్భయముగా తెలుపుకొనవచ్చును."

## వైస్రాయి గారికి శరత్ బోసు గారి లేఖలు

క్రొత్తఢిల్లి, ఆగష్టు౧౭

బెంగాలు నాయకుడగు శరత్‌చంద్రబోసుగారిపుడు డిటెనూఖైదీగానున్నారు. వారు ఇటీవల చాలముఖ్యమైన ఒకదీర్ఘలేఖను వైస్రాయిగారికి పంపించినారట. అది రాజకీయ పరిస్థితిని దేశములోని ఆహారపరిస్థితిని సంబంధించినదై ఆవిషయముల నివారణకు సూచనలను తెలుపుచున్నదనుకొనుచున్నారు.

ఫ్రీప్రెసు జర్నల్.

## కాశ్మీరము నుండి బహదర్ ఖాన్ గారి ఉద్వాసన

శ్రీనగర్, ఆగస్టు౧౬

ఒక ప్రభుత్వప్రకటనలో ఇట్లున్నది:—

జమ్ము, కాశ్మీర రక్షణ నియమాలలో ౨౬వ దానిననుసరించి హైదరాబాదువారగు నవాబు యార్‌జంగు బహదర్ గారిని పదునాల్గుగంటలకై శ్రీనగర్ జిల్లా మేజిస్ట్రేటు ఆజ్ఞనిచ్చెను. ఆయాజ్ఞను వారికిచూపగా వారు తాను ఇక వెంతమాత్రము నవాబ్ యార్‌జంగును కానని ఆయాజ్ఞను పాటించుటను నిరాకరించిరి. కాని హైదరాబాదు బిరుదమును ఆయనవదలుకొనినను జయాజ్ఞ ఉద్దేశించబడిన మనిషిఆయనయేయనియును ననుసరించి ఆయాజ్ఞ జిల్లామేజిస్ట్రేటు చేయుచుండెనని యనుకొనుటవల్ల పోలీసులకునవాబ్ యార్‌జంగ్ ఆయాజ్ఞను పాటించనపుడు ఆయనను కాశ్మీరరాష్ట్రపుసరిహద్దుల బయటికి పంపివేయుటకు అధికారముగలదు. అదే ప్రకారము ఆయననునిన్న పోలీసులు సరిహద్దుల బయటికి విడిచినారు.

*

నవాబ్ యార్‌జంగ్ బహదర్ గారిని కాశ్మీరమునుండి పంపివేసిన సమాచారము తెలియగానే నిన్నమజ్లిసుఇత్తెహాదువారు సభ ఏర్పరచినారు.

## ఆఫ్రికాలో భారతీయుల దురవస్థ

దక్షిణఆఫ్రికాలో భారతీయకాంగ్రెసు వారు ఇటీవలఆమోదించిన తీర్మానములను ప్రధానియగు జనరల్ స్మట్సుగారికి విన్నవించుకొనుటకు రాయబారులనుపంపించెదమని విన్నవించిరిగాని స్మట్సుగారు ఆమనవులనువినుటకు నిరాకరించిరి. ఇకరదీవాలకు మొఱపెట్టుకొనవలెనసే చెదరింపుచేసినారు—కాబట్టి ప్రధానిగారునిరాకరించిన వారికార్యదర్శి ఆకాంగ్రెసుకు తెలిపినాడు. ఆ కాంగ్రెసువారితీర్మానములలో నొకటి బ్రిటనుకును అమెరికాసంయుక్తరాజ్యములకును,పోయి అక్కడిప్రజలకు దక్షిణాఫ్రికా భారతీయులస్థితిని తెలుపుటకై కొందరురాయబారులను పంపించవలెననియున్నది.

## శాంతిప్రయత్నంలో ప్రాణత్యాగము

సిల్హెట్, ఆగష్టు౧౭

సిల్హెట్‌లో మురారిచందకాలేజివిద్యార్థియగు అబ్దుల్ హామీదు సిల్హెట్ జిల్లాలో ఉజనిగాపూర్ గ్రామములో ఒకఅల్లరినిఆప యత్నించుటలో ప్రాణములను గోల్పోయెను.

ఆగ్రామంలో రెండుపార్టీలవారలకు ఒక భూమివిషయములో వివాదము జరుగుచుండినపుడు సమాధానపరచుటకు ఆవిద్యార్థిపోయెను. వివాదగ్రస్తులు ఆతనిపైబడికొట్టిరి. అందుచే అతడు మరణించెనని తెలియుచున్నది.

